ఓం

# దరిద్ర నారాయణ వ్రతము

రచయిత

యక్కలి రామయ్యగారు.

ప్రకాశకులు:

అఖిలభారత ఆర్యవైశ్య యువజనమహాసభ,

శికింద్రాబాదులో ప్రకటితము

మొదటికూర్పు :-: 1000 ప్రతులు

# తొలి పలుకు

వ్రతములెప్పుడు ప్రచారములోనికి వచ్చెనో యను విషయము పరిశోధింపదగినది. హిందువులలో జనబాహుళ్యము వ్రతముల మూలమున స్వర్గాది సీమల బహుసులభముగా సాధింపవచ్చునను భ్రమలో పడిపోయెను. ఆభ్రమకు సర్వవిధాలా దోహదమిచ్చి వృద్ధిపరచువారుగూడా బయలుదేరిరి. అముక వ్రతము చేస్తే కైలాసము లేదా వైకుంఠము తప్పకుండా లభిస్తుంది. మరి అముకవ్రతాన్నిచేస్తే కల్పాంతమువరకూ సూర్యలోకంలోఉండి తర్వాత భూలోకానికి దిగివచ్చి "చక్రవర్తి భవిష్యతి" "నసంశయః" అన్నారు. ఇహమందుపుత్రపౌత్రాది బహుళసంతానాభివృద్ధిని ధనధాన్యాలను పరమందు రంభా మేనకాది భోగవుసానుల పొందును నిత్యయౌవనమును మరికొన్ని వ్రతాలవల్ల పొందవచ్చునని తెలుపుతూ ఆమాటలను భక్తులు తొందరగానమ్మేటట్లై దేవభాషలో వ్రాస్తూవచ్చిరి.

వ్రతములసంఖ్య కాలక్రమమున పెరుగుతూవచ్చినది. నేటికిని పెరుగుతున్నది. దానికీదరిద్రనారాయణస్వామి వ్రతమే ఉదాహరణము. భారతభూమిలోని వివిధప్రాంతములలో వివిధ వ్రతాలు కల్పింపబడెను. మహారాష్ట్రిలలో నుండువ్రతాలు తమిళులలో లేవు, బంగాళములోనుండు వ్రతాలు గుజరాతులోలేవు. సత్యనారాయణ వ్రతమనునది నూరేండ్లకిటీవలిదేఅని తోస్తున్నది. హోళి దసరా దీపావళి సంక్రాంతి ఉగాదివంటి ఋతుసంబంధోత్సవాలు ప్రాచీనమైనవిగా కానవస్తున్నవి.

శ్లో॥ పురాణమిత్యేవ న సాధుసర్వం
నచాపి కావ్యం నవమిత్యవద్యం

సంతః పరీక్షా న్యతరద్భజంతే
మూఢః పరప్రత్యయనేయబుద్ధిః

అని అన్నారు పెద్దలు. పాతదంతా మంచిదికాదని కాని కొత్తదంతా సత్యమైనదనికానీ నేనన‌ను, తార్కికబుద్ధికి సత్యమని తోచిన విషయాలనే స్వీకరించి తదన్యమును నిర్భయముగా విమర్శింపవలెను.

సత్యనారాయణ వ్రతానుయాయి ఈదరిద్రనారాయణ వ్రతము. రచయితలగు శ్రీ ఎక్కలి రామయ్య గారు మూడులోపాలుచేసినట్లు కానవస్తున్నది. ఈవ్రతముయొక్క ఫలము పరలోకమందెట్టిదై యుండునో తెలుపలేదు. హిందువులలో చాలామందికి ఇహలోకముకంటే పరలోకపుముచ్చట్లే ప్రీతినిచ్చును. ఈవ్రతము ఏపురాణాంతర్గతమైనదో తెలుపలేదు. ఏపురాణాశ్రయమైనా వ్రతానికిలేకున్న దానిని జనులాదరింపరు. ఈవ్రతాన్ని ప్రధానముగా సంస్కృతములో వ్రాయవలసియుండెను. గీర్వాణవాణికుండు మహిమ దేశభాషలకుండునా? ఈలోపాలను సవరిస్తే ఈవ్రతము పౌరాణిక పూర్వాచార పరాయణులకు గూడా ఆదరణీయమగునేమో.

ఈవ్రతములోని విషయాలుత్తమములు, భావములు సుందరములు. విశ్వ సేవావ్రతమే ఈ దరిద్రనారాయణవ్రతమని నిరూపించినారు. మానవసేవయే మాధవసేవ అన్ననీతి ఇందున్నది ఈ వ్రతాన్ని అందరూ ఆచరిస్తే దేశదారిద్ర్యము దరిద్రనారాయణుని అనుగ్రహముచే పటాపంచలగును. కవిగారి ప్రయత్నము అభినందనీయము.

దక్షిణ హైద్రాబాదు
౧౨-౪-౧౯౪౩ } సు. ప్రతాపరెడ్డి బి.ఏ.బి.ఎల్.

# దరిద్రనారాయణస్వామివారి

## అష్టోత్తరశతనామావళిపూజ.



ఓం. దరిద్రనారాయణాయనమః
,, దీనజనరక్షకాయనమః
,, దరిద్రజనోద్ధరణ బద్ధకంకణాయనమః
,, దరిద్రనరావతారాయనమః
,, నిరాధారాధారాయనమః
,, ఆర్తిహరణాయనమః
,, క్షుధోపశమన కాంక్షితాయనమః
,, నిర్ధనిక పక్షావలంబినేనమః
,, కష్టజీవన ప్రాణికారుణ్యావిలోకాయనమః
,, శ్రామికజనాభివృద్ధి పరాయనమః
,, వేదప్రతిపాదిత సామ్యవాద సిద్ధాంతాయనమః
,, ఆర్తత్రాణ పరాయణాయనమః
,, దరిద్రజీవితాదర్శ ప్రదర్శాయనమః
,, ఆధునికార్థికసూత్ర విప్లవకరాయనమః
,, ఆర్థికధర్మసంస్కరణ సంకల్పాయనమః
,, దరిద్రజనార్థిక దుఃఖార్తిహరణాయనమః
,, ధర్మనిర్మాణ దీక్షాదక్షాయనమః
,, సర్వమానవ శ్రేయోభిలాషినేనమః
,, సర్వమానవకళ్యాణ కాంక్షితాయనమః
,, విశ్వకళ్యాణాసక్తాయనమః

,, సర్వమానవ సౌభ్రాతృత్వాభిలాషినేనమః
,, సర్వమానవ సౌహార్ధవృత్త ప్రవృత్తికరాయనమః
,, నిష్పక్షపాతాయనమః
,, సర్వసమత్వాయనమః
,, మతమర్గర్వవినాశాయనమః
,, జాతిదురభిమాన దూరీకృతాయనమః
,, సాంఘికనిమ్నోన్నత నిరసనాయనమః
,, జన్మాధిక్య సిద్ధాంత వితండవాద ఖండనాయనమః
,, సర్వమానవ సమత్వవిలోకనాయనమః
,, అస్పృశ్యతా పిశాచోత్పాటనాయనమః
,, కులతత్వావసాన నిరీక్షణాయనమః
,, హరిజనసంఘోద్ధరణ దీక్షాపరతంత్రాయనమః
,, గుణత్రయాయనమః
,, త్రిగుణాతీతాయనమః
,, గుణకర్మసిద్ధాంత ప్రతిపాదనాయనమః
,, సనాతనవర్ణ వ్యవస్థాపునస్థాప నోన్ముక్తాయనమః
,, బూటకధర్మ నిర్మూలకరాయనమః
,, దృష్టిదోషాద్యరిష్టాచార నిరసనాయనమః
,, శబ్దదోష వ్యతీకరాయనమః
,, వేదధర్మపునః ప్రతిష్ఠాపన పరాయనమః
,, నిమ్నజాత్యుద్ధరణాయనమః
,, హరిజనశ్రేయోభిలాషినేనమః
,, భావదాస్య విభిన్నకరాయనమః

,, కర్మదాస్య తృణీకృతకరాయనమః
,, మానవసర్గర్వాప హరణాయనమః
,, దాంభిక నిరసనాయనమః
,, కాపట్య విధ్వంసాయనమః
,, నిస్వార్థాయనమః
,, స్వార్థపరమదేభ హార్యక్షాయనమః
,, విశుద్ధప్రేమ స్వరూపాయనమః
,, అహింసాత్మకాయనమః
,, హింసావిసర్జన కరాయనమః
,, సురాక్రమణ పరదూరాయనమః
,, సర్వదేశ స్వేచ్ఛాప్రసాదాయనమః
,, సకలదేశ స్వయంనిర్ణయాధికార ప్రసాదాయనమః
,, స్వాతంత్ర్య హరణోద్యమ నిరాకరిణాయనమః
,, స్వాతంత్ర్య వరదాయనమః
,, జాతీయభావ వాతావరణ కల్పితాయనమః
,, జాతివిభేదశాసన నిర్మూలకరాయనమః
,, దాస్యభంజనాయనమః
,, దాస్యశృంఖల విచ్ఛేదనోద్యమ సంధానకరాయనమః
,, సత్యాగ్రహి సంరక్షకరాయనమః
,, సత్యాగ్రహ వరదాయనమః
,, అధర్మ హరణాయనమః
,, ప్రజాస్వామ్య ప్రతిష్ఠాపనాచార్యాయనమః
,, ప్రశాంత ప్రజాప్రభుత్వస్థాపన దీక్షాయనమః

,, దౌష్ట్యనిర్మూలన కరాయనమః
,, నిరంకుశాధికార నిర్వాపణాయనమః
,, ప్రజానురంజక పరిపాలన ప్రియుక్తాయనమః
,, స్వదేశవస్తునిర్మాణ ప్రోత్సాహకరాయనమః
,, స్వదేశీవ్రతాలంబన దోహదకరాయనమః
,, దేశీయవస్త్రధారణాసక్తి ప్రకల్పితాయనమః
ఓం. ఏకేశ్వరాయనమః
,, అనంతాయనమః
,, అప్రమేయాయనమః
,, అచింత్యాయనమః
,, అవాఙ్మానస గోచరాయనమః
,, ఆదిమధ్యాంతరహితాయనమః
,, సనాతనాయనమః
,, సచ్చిదానందాయనమః
,, నియతాయనమః
,, నిశ్చితాయనమః
,, అనాద్యైనమః
,, అనంతాత్మనేనమః
,, సర్వభూతేశాయనమః
,, సర్వభూతహృద్దేశస్థాయనమః
,, మానవేశాయనమః
,, మానవరూప విరాజితాయనమః
,, సకలప్రాణి రూపాయనమః

,, సకలజడాంతస్థాయనమః
,, విశ్వైకశక్త్యాయనమః
,, సకల భూతాంతశ్శక్త్యైనమః
,, పరంజ్యోతిషేనమః
,, జగతీశాయనమః
,, ప్రకృత్యంతరూభూతాయనమః
,, ప్రకృత్యతీతాయనమః
,, ప్రకృతిస్వభావాయనమః
,, ప్రకృతినైజాయనమః
,, ప్రకృత్యైనమః
,, సత్యస్వరూపాయనమః
,, సత్యప్రియాయనమః
,, ధర్మస్వరూపాయనమః
,, పుణ్యాయనమః
,, అజ్ఞానతిమిరభాస్కరాయనమః
,, అవిద్యాజలద ప్రభంజనాయనమః
,, విజ్ఞానమూర్త్యైనమః
,, సుజ్ఞానజ్యోత్యైనమః
,, ఆధ్యాత్మిక జ్ఞానప్రబోధకాయనమః

దరిద్రనారాయణ పూజాంకరిష్యామి, ధూపం దర్శయామి, ఖాదీమాల సమర్పయామి, ఖద్దరువస్త్రం సమర్పయామి, ధూప, దీప, నైవేద్య, తాంబూల, నారికేళ, ప్రసాదం సమర్పయామి. నీరాంజనం సమర్పయామి.

# దరిద్రనారాయణ వ్రతమహాత్మ్యము.

—◆ క థా ప్రా రం భ ం ◆—

ఆ. వె. అనగననగ దండకారణ్యమున "మహా
బదరి" యనెడు నొక్కవనముగలదు
అందు ఋషులు మునులు నందఱుగూడిన
యొక్కసమయమందు నొదవెచర్చ

ఆ. వె. సూతఋషిని గూర్చి శుద్ధవై దీక్ష తా
శౌనకాది మునులు సంభ్రమమున
తమమనంబులందు దగిలిన సంశయ
మూడ్చుకొనగ వేసి । రొక్కప్రశ్న

అయ్యా! సూతమహర్షీ! ఆధునికమగు గాంధీయుగ మందు మానవులు 'దరిద్రనారాయణవ్రతము' అను నొక్క విచిత్రమైన వ్రతమును చేయుచున్నారే! ఇట్టివ్రతము పూర్వ కాలమందెన్నడైన నుండెనా? దాని విధానమేమి? ఫలమేమి?

ఆ. వె. వ్రతములెన్నొగలవు వ్రతవిధానంబులు
నెన్నొగలవు ఫలము లెన్నొగలవు
గాని యిట్టివ్రతము కనలేదు వినలేదు
దీని తెలియుమార్గ దెల్పుమయ్య!

అని ప్రశ్నించిరి. అంతటను సూతమహర్షి శౌనకాది మునులను గూర్చి "అయ్యలారా! వినుండు! ద్వాపరయుగమున శ్రీకృష్ణుండు "యదాయదా హిధర్మస్య గ్లానిర్భవతి భారత

............సంభవామి యుగేయుగే" అని చెప్పినాడు గదా! అటులనే, ఆధునిక యుగమున ప్రపంచమంతటను మానవులలో ధనికులు, దరిద్రులు అను రెండు తెగలు యేర్పడి, సర్వత్రి ధనికులవల్ల దరిద్రులకు, సాంఘిక, ఆర్థిక, దైవిక, మత, విషయములందు ఘోరాపకారము సంభవించుచుండుట చేతను, మూనుమిక్కిలి నానాట దరిద్రులసంఖ్య మితిమీరిపోవుచు, దేశములో నెచ్చటజూచినను, మృత్యుదేవత యొక్క ముఖ్యమంత్రులగు, ఆకలి, ఆర్తి, దైన్యము, వ్యాధులు తాండవనృత్యము సలుపుచుండుట చేతను. సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే దరిద్రనారాయణుడై భూలోకమున నవతరించి, దరిద్రనారాయణ వ్రతము చేసినవారికి మాత్రమే చతుర్విధ ఫలపురుషార్థములు, లభింపజేయుటకు బద్ధకంకణుడై యున్నాడు.

పూర్వకాలమున భారతదేశమున పరస్పర మతద్వేశములచే నంతఃకల్లోలము లుదయించి, రాజులన్యోన్యము కలహించు చుండునప్పుడు, యిట్టి విపరీత పరిస్థితియే యున్నొకప్పుడు సంభవించినది. అప్పట్లో జరిగిన సంఘటనలను మీకు చెప్పెదవినుండు.

గీ॥ జగతియంతట యుద్ధముల్ సాగుచుండ
కఱవు గ్రామాదులన్నిట గ్రాలుచుండ
కడుపుచిచ్చున పేదలు మడియుచుండ
ఘోరదుఃఖార్తి నరుల్‌లో కుములుచుండ

వచః—మానవకోటికి గలిగిన ఘోరపరిస్థితి నివారించు టకు తెరువెద్దియుగానక

గీ॥ అఖిలమానవ సేవాపరాయణుండు
సర్వభూతార్తి హరణ ప్రసక్తిపరుడు
విశ్వకళ్యాణకాంక్ష, తఁ, వేగిరింప
నారదుండేగె వైకుంఠనగరమునకు

వచః—అచ్చట శ్రీమన్నారాయణుని గానక, పాలసము ద్రమువైపు పరుగులెత్తుచూ,

శా॥ ఓ! విశ్వాత్మక! యోభయార్తిహరణా! యోలోకసంభా వనా! యో!విశ్వైకమహాత్వతత్వవిభవా! యోసర్వభూ తాత్మకా!యీ వేదిక్కు! మహావిపత్సమయమం!దీదీనులఁ బ్రోవ, కాదా! విశ్వంభర! యో, దయామయుడ! ఓదారి ద్ర్యనారాయణా!

అని భగవంతుని యెలుగెత్తి పిలుచుచూ, పాలసము ద్రములో నొక్కయెడ శేషపాన్పుపై పవళించి, ప్రపంచము యొక్క యభివృద్ధినిగూర్చి యాలోచించుచుండిన శ్రీమన్నా రాయణుని సాన్నిధ్యమునకరిగెను గోచిపాతరాయడును, నిరం తర మానవసేవాపరాయణుడు, అగు నారదమహర్షిని చూచి నంతనే శ్రీమన్నారాయణుండును,

గీ॥ నాకు, నాపానుపగునట్టి నాగమునకు
నాదు సహచరిలక్ష్మికి నాగ్రహమునకు

నాదు సంసారమునకును పాదనంగ
చెలగు వటపత్రమునకు వేం। చేయుమయ్య!

అని యాదరముతో నాహ్వానించుచు, పానుపుకిందఁ సముద్రముపై తేలియాడుచున్న మఱ్ఱియాకుపై కూర్చుండ నియోగించెను. అంతట నారదుండు హే! మహాత్మా!

ఆ. వె. సర్వసంపదలకు సర్వభోగములకు
నాలవాలమైన యాదిలక్ష్మి
నీదు యండనుండ నీకేల యీ ధియా
నక, దరిద్రజీవనంబు' దేవ!

గీ॥ "అదియు, కల్లోలజలధి మధ్యంబునందు
యొంటిపాటున గడుపంగ నొప్పునయ్య?
బీదలాకటిచిచ్చుచే భీషణముగ
మాడి చచ్చుచునున్నను మాన్ప లేక."

అని ప్రశ్నించెను. అందులకు శ్రీమన్నారాయణుండు చిరునగవు తనమోముపై తాండవింప నిట్లు ప్రత్యుత్తర మొసంగెను. హే! నారదా! నేను సర్వభూతాత్మకుడనై యున్నను మానవరూపేణ యీవిశ్వమునంతటను వెలసియున్నాను. మంచిచెడ్డలను, పుణ్యపాపములను, తెలుసుకోనగల విజ్ఞానము చేతననే సకలజీవరాసులందును, మానవుడు ఉత్తముడై యున్నాడు అట్టిమానవుని సత్పథమున నడుపుటకే, నేనియాదర్శ జీవితమును గడుపుచున్నాను. నా, యీజీవితమే మానవుని జీవితమును బోలియున్నది. ఎట్లనః-పాలసముద్రమువంటిదే మాన

వుని యొక్క సంసారసముద్రము, పాలవలె ఆకర్షణీయముగను అభిరుచికరముగను, కనుపడినను, అది సముద్రమువలె యగాధమైనదిన్ని, అపాయకరమైనదిగా నున్నది. సముద్రములో మత్స్యిగూకువలె మానవుని సంసారమున కాధారభూతమగు గృహారామక్షేత్రాదులు కూడా సంసారకల్లోల తరంగములలో, అస్థిరమును, అపనమ్మకమునైయున్నవి.

ఈ మహాభయంకర విషసర్పముయొక్క ముఖములనుండి నిరంతరము వెలువడుచుండు ఫూత్కారముల వలె, కామక్రోధాదులయొక్క బిభీషికల యాచ్ఛాదనములోనే మానవుడు తనజీవితమును, భయంకరమగు అపాయపరంపరలలో వెళ్లదీయుచున్నాడు. ఏఘడియన, యేముహూర్తమున, తన నాచ్ఛాదించియున్న కామక్రోధాదులకు తాను బలియైపోవునో తనకే తెలియదు. లక్ష్మి నాయందునున్నట్లే సిరి, మానవుని యందునున్నది. కాని, యింతటి భయంకర, అపాయకర, అశాశ్వతకర, కల్లోలపరిస్థితులలో మానవుడు తనమనస్సును కుదుటపఱచుకొని, 'సిరి' నిప్రశాంత వాతావరణములో, ఆనందముగ ననుభవించగల నేర్పు సంపాదించుటలోనే ప్రజ్ఞ గలదు

నేను కల్పావసాన యోగనిద్రనుండి మేల్కాంచి, నా, నాభినుండి చతుర్ముఖబ్రహ్మ నుద్భవింపజేసినట్లే, మానవుడు మాతృగర్భమునుండి విడివడి, స్థితప్రజ్ఞుడై, చతుర్విధ ఫలపురుషార్థములను సాధించవలయును లోకోద్ధరణకై పూనిన నన్నభినం

దించుటకు మహర్షిగణము విధివిరామము లేకుండ విచ్చేయు చున్నారు. పురుషార్థములను సాధించి మానవసేవకై పూనినవ్య క్తిని అభినందించుటకు పలువురు సజ్జనులరుదెంతురు. ఇదినా ధర్మము. అది మానవునిధర్మము.

ఈవాక్యములువిని నారదుండు శ్రీమన్నారాయణుని జూర్చి యిట్లుపలికెను.

సీ॥ దుర్లభంబైన చతుర్విధ పురుషార్థ
ములను సాధింపగా బూనినట్టి
వరునకు సులువగు తెరగద్దియైనను
కలదో, లేదో! తెల్పవలయు దేవ!
కలిగినచో, దాని కలవివ్వ వేడెద
విధివిధానంబుగా, వేదవేద్య!
జగతికళ్యాణంబు సలుపనేతివునీవు
క్షితికిశ్రేయంబు కాంక్షింతు నేను.

గీ॥ మానవుల హృదయసీమల మనుదువీవు
మానవుల సేవచేతనే మనుదునేను
భూతకోటులు నీహంశగావె, యీశ!
జీవకారుణ్య కాంక్షినో దేవ, నేను,

కావుననో దేవా! నాద్వారాలోకమున కుపదేశింప దల చిన సులభమార్గ మేదైననున్న నుపదేశింపుడు.'' అని ప్రార్థిం చెను. అంతట భక్తజన సులభుడగు నారాయనుండ "నార

దా! లోకకళ్యాణము నిమిత్తమై నీద్వారా మానవకోటి కంతటికిని బోధింపదలచిన వ్రతమొండుగలదు. దానిని దరిద్రనారాయణ వ్రతమందురు. దానికీడగువ్రతము మఱియొండు లేదు. ఇదియే మానవుని కిహపరములకు శ్రేయస్కరమైనది. చతుర్విధ ఫలపురుషార్థ సాధకమైనది. ఈవ్రతవిధానములోని సూక్ష్మధర్మములను వినుము.

గీ॥ దీనజనుల క్షుధాగ్నిని దీర్చుటొకటి
వారియభివృద్ధి మనసార గోరుటొకటి
నరుల దొకజాతియోయని నమ్ముటొకటి
జన్మచే హెచ్చుతగ్గులెంచనిది యొకటి
సర్వమానవ సౌహార్ద సరణియొకటి॥

ఈపంచ సిద్ధాంతములను మనసులో నుంచుకొని చేతనైనవారు చేతనైనట్లు యీవ్రతము నాచరింపవచ్చును. కాని భూస్వాములును, ధనికులును, జమీందార్లును, పాలేగార్లును, యీమహాకలికాలమున, లోభులై దరిద్రనారాయణ వ్రతమొనర్పక గర్వించినచో, వారికి ఆర్థికముగను, సాంఘికముగను, రాచకీయముగను, గొప్పయనర్థకములు సంభవించుట నిజము.'' అని చెప్పెనని సూతుండు శౌనకాదులకు వినిపింప వారు ''అయ్యా!

గీ॥ ఈవ్రతంబును మున్నెవరేని జేసి
యిష్టకామ్యార్థసిద్ధుల నెనసినారె?
వీనులకు పండువుగ వినవేడ్కయయ్యె
వారికథలను జెప్పగావలయునయ్య!

అనియడిగిన సూతుండును, శౌనకాదులారా! సావధానముగ వినుండు! శ్రీమన్నారాయణునివలన విధివిధానముగ తెలుసుకొనిన 'దరిద్రనారాయణ వ్రతమును' నారదుండొక శ్రీమంతుడగు వణిజున కెఱిగించెను. ఆవణిజుండును వ్రతసమాప్తి జేయుటలో కొన్ని లోపంబులొనరించి, కష్టనష్టములొంది మఱలమఱల ప్రబోధితుడై, కడకు నిష్కళంకముగ వ్రతమొనర్చి చతుర్విధ ఫలపురుషార్ధముల నొందినవాడాయెను. ఆకథ వినుపింతు వినుండు.

ప్రథమాశ్వాసం సంపూర్ణం.



# దరిద్రనారాయణ వ్రతమహాత్మ్యము.

## — ద్వితీయాశ్వాసము —

గీతమాలిక:-

భరతదేశంబునను మహాభాగ్యభోగ్య
లీలలకు నాస్పదంబు కళింగపట్న
మొండు గలదందు ధర్మభాగ్యుండనంగ
నొక్కవణిజుండు గలడత డోడబేర
ములను జేయుచునుండి య । పూర్వసంప
దోన్నతుండయ్యెఁ; గాని, తానొక్కపుడును
ధనముగడియించు చేతప్ప నదితర ప్ర
సక్తియందున బుద్ధిని జారనివడు,
పగలురాత్రియు వృత్తిసంపాద్యమందె
మునిగి తేలుచు, లోభియై మనుచునుండె.

సీ॥ తీవ్రప్రవాహంబుచే దేశము గగ్గోలు
పడుచుండినను దానిపజ్జబోడు,
ఆకలిచిచ్చుచే నతిబీదలందఱు
చచ్చుచుండినగాని జాలిగొనడు
గామునివాపరిణా సమితులంగున జేరి
శ్రీద్ధంత తనవంతు సలుపబోడు;
వ్యాధులు చెలరేగి ప్రజల నూడ్చుచునున్న
మానవసేవకు మఱలబోడు;

గీ॥ ఆర్తి, దుఃఖము, హాహారవాదిఘోష
తార! శ్రవణపుటంబుల జేరనివడు
సంఘ సామాజికముల పరిసక్తి బోడు
దీనజనసేవ జేయ చిం। తించబోడు॥

వచ:-నిర్భాగ్యమోటముగ తనపని తాను జూచుకొను చున్న యావణిజునకు దైవవశాత్తుగ నోడబేరములో కొంత నష్టము చేకూరుటచే, నాతడు తనపుట్టి మునిగిపోయినట్లు చింతించుచుండ, నారదుండా తనికడకువచ్చి, యిట్టి శ్రీమంతుని మనస్సుమార్చి త్యాగబుద్ధిని కల్గించనయెడల బీదలకు కొంత వఱకు సహాయపడగలడని యెంచి, యతనికి దరిద్రనారాయణుని మహాత్మ్యమును చెప్పి. వ్రతమొనరింప ప్రోత్సహించెను.

వణిజుండును నారదుని హితోపదేశము ననుసరించి దరిద్రనారాయణ వ్రతము పరిసమాప్తిగావించి తన ముగ్గురు కుమారులతోడను, బంధుమిత్రపరివారముతోడను వ్యాపారమునకు బయలుదేరినవాడై, వ్రతమహాత్మ్యమువలన వెనుకటి నష్టమును భర్తిచేసుకొనుటయేగాక పైపెచ్చులాభమును గూడా సంపాదించగలనని మురియుచు, ఓడనెక్కి పోయెను. ఆయోడ మహాసముద్రములో పోవుచుండ నొకానొక ద్వీపము వద్ద బ్రహ్మాండమైన తుపాను రేగుటచే, నావికుల వశముతప్పి ముందువెనుకలకు కొట్టుకొనిపోవుచూ, జలములోనుండు నొక తిప్పయొక్క శిఖరమునుతగిలి, యొఱిగి పడిపోయెను. తత్క్షణమే వణిజుడు ఓడలోని యొకబోటుపై సముద్రజలముపై నడు

పుకొనుచూ, ఒడ్డునకుజేరెను. అదియొక చిన్నద్వీపము నిర్మా నుష్యముగ కనుపడిన యాతీరమున కూలబడి యాతడనేకవిధ ముల పలవింపదొడంగెను.

ఇంతలో నొకవృద్ధుడచటికివచ్చి; నాయనా!

ఆ. వె. "ఎవ్వడవో నీవు యేయూరివాడవో
రాలుగటుగ నేడ్చెదేల నీవు?
అంతఘోరకష్ట మదియేమి యొదవెనో?
తెలుపుకొంటివేని తీర్తునయ్య!"

అనిపలికెను. వెనుకనుండి ధ్వనించిన యీ మనుష్య వాక్కులనువిన; త్రుళ్లి తుళ్ళిపడిలేచి మనవణిజుడు ముసలిబడు గుతో నిట్లని మొరపెట్టెను. "ఓ! తాతా!

గీతమాలిక:-

జనులకపకార మొక్కింత సలుప లేదు;
చేయగూడని పాపముల్ చేయలేదు;
నాకృషియెతప్ప యితరము నాకుబట్ట
దొరులజోలికి నెన్నడేనరుగలేను;
నాయినుపపెట్టెలకె నేను గాయకైపుడు
మొక్కలిడుచుందు; నావగుదొక్కములనె
లెక్కలిడుకొందు నిత్యము పెక్కుమార్లు,
నష్టకష్టములెందుకు నాకుగలిగె?

ఆమాటలకడ్డమువచ్చి యాముముసలి, ఓ! కుమారా! అత్యంత శ్రీమంతుడవగునీవు నీపరిసరములనున్న బీదజనులు ఆకలిచే మాడిచచ్చుచున్నను, స్వార్థపరుడవై పరజోలి నాకెందుకని పట్టించుకొనక, నీడబ్బునీవు లెక్కపెట్టుకొనుటలో నీ కాలము వెళ్ళబుచ్చుకొనుచుండుటవల్లనే దరిద్రనారాయణుని యాగ్రహమునకు గురియైతివి. ఆ కారణముననే ఓడబేరములో హెచ్చరికగా నీకు కొద్దినష్టము గల్గింపబడెను.” అని పల్కిన తక్షణమే మనవణిజుండందుకొని “ఓ! తాతా! నాయీప్రయాణమునకుముందు దరిద్రనారాయణ వ్రతమును గూడా నొనరించితినే?

ఆ. వె. ఓడజలములందు జాడలేకుండగ
బోయెనేల? పుత్రులీయగాధ
జలధి గర్భమందు సమసిపోవగనేల?
వగపుకొలకు నేను మిగులుటేల?”

అని ప్రశ్నించెను. అందులకావృద్ధుడు “వణిజుడా! నారదోపదేశ ప్రకారము వ్రతసమాప్తియైన పిదప త్యాగబుద్ధితో బూరి తృప్తి చేయలేదేమో? గనుకనే నీకింతటి ఘోరవిపత్తు సంభవించినదనెను అందులకు ధర్మభాగ్యుడు “తాతా!

ఆ. వె. నాదుబంధువులను నాదుకులస్థుల
నన్నిహద్దులందు నున్నవారి
యిల్లువరుసబెట్టి యెల్లరబిలిచిభో
జనముబెట్టిసాగ ననిపినాను.

నాకేమి! ధనమునకు కొఱవగనుకనా? ధాన్యమునకు కొఱవగనుకనా! షడ్రసోపేతముగ భోజనము పెట్టించితిని. మంచిమర్యాదచేసితిని." అనెను అందులకుముసలితాత నవ్వుచూ, "ధర్మభాగ్యుడా! యిందులోనీ త్యాగమేమున్నది? యీ రోజునీవు నీకులబంధువుల నందఱిని భోజనమునకు పిలిచితే, రేపువారివారియిండ్లలో కార్యములు జరిగినప్పుడెల్ల నీకుటుంబమువారిని భోజనమునకు పిలుస్తారు. ఇది యిచ్చిపుచ్చుకొను వ్యాపారమువంటిదే! అందులోను లాభనాటిబేరమే! అంతియే కాని, యిది త్యాగమౌతుందా? లేక ధర్మమౌతుందా" అనెను.

ధర్మభాగ్యుడు మనసు చివుక్కుమనగ చిన్న పుచ్చుకొని: "అయినచో, తాతా! మిత్రుల నందఱినిపిలిచి తృప్తికరంగా భోజనము పెట్టి పంపించినానే! ఇదియేమగును? అందులకుతాత జవాబిచ్చుచు; "వత్సా! యిందులోమాత్రము నీత్యాగమేమి గలదు? నీచే యాహ్వానింపబడిన మిత్రులందఱును ప్రతిఒక్కడును మామూలుగా రవికెగుడ్డలును, కొబ్బరగిన్నెలును కానుకగా తీసుకవచ్చినారుగదా? నీవుపెట్టినభోజనము వారు తెచ్చినకట్నములకంటె యెక్కువవిలువకాదే! గనుక యిది కూడా లాభనాటిబేరమే!" యనెను. అంతటవణిజుడు సిగ్గుపడుతూ, చికాకుతో "అయితే పోనీ! తాతా! యేవిధమైన కానుకలు తీసుకరాకుండనే 50, 60 మంది బ్రాహ్మణులపట్టీ ప్రకారం ఒక్కరిని కూడా బీరుపోకుండా పిలిపించి, సంతర్పణ జేసి, సంభావనలుకూడా యిచ్చి పంపితినే! దీనికేమని యెదవు?" అనేను అందులకాముసలి నవ్వుచూ, "పిచ్చి

ధర్మభాగ్యుడా! కళింగపట్నములోనున్న విప్రులలో, నీకంటికి దిసాయించిన వారిని, ఋణఅక్కరపడువారిని, కోర్టువ్యవహార ములలో నీకుసహాయపడువారిని నీవద్దలెఖలువ్రాయుటరీత్యా ము లాజాగలవారిని, యేరి, కోరి, పట్టిర్రాయించితివి. వారుక్షు ద్బాధాపీడితులుగారు. వారందఱును అంతో యింతో కలిగిన వారే అట్టివారికే నీవు భోజనము పెట్టితివి. వారునీవు పెట్టినభో జనములో, లోపములను లెక్కించువారేగాని, ఆత్మతృప్తిగా. క్షుత్తుతీరినదనుకొని సంతసించిన వారెవ్వరును లేరు, ఇదిములా జా సంపాదించుకోవడమే యగునుగాని, భూతతృప్తియాతుం దా? పైపెచ్చునీకు యిందులోప్రతిఫలముగూడాయున్నది,

ద్విపద:- అని చెప్పియావృద్ధుడా కస్మికముగ
తననిజరూపంబుదాల్చి దివ్యుండై
పాణితలంబున వీణియబూని
ఆకాశవడిగా వెళ్లునట్టి పోవడను
గాంచివణిజుడు మదినెంచెనీపగిది
ముదుసలి, నారదమునియౌటనిజము'
లేకున్ననీతడెట్లీకథలన్ని
పూసగుచ్చినయట్లు పోల్చి చెప్పెడిని!
అనిధృఢనిశ్చయుండగుచునా వైపు
పరుగిడియాతని పాదముల్ బట్టి
హే! మునిశ్రేష్ఠ! నా, యీతప్పునైచి

కరుణింపుమని జాలిగదుర ద్రొక్కియును
ఓ! తండ్రి! యీమాఱు భూతతృప్తిగను
ప్రతిఫలరహితమౌ భావంబుగల్గి
త్యాగంబుతోడ సంతర్పణ జేసి,
వ్రతసమాప్తి యొనర్తునటి శ్రద్ధగాను
అనిపల్కె యామాని యంగీకృతముగ
తలయూపి, పిదపయిట్టులపల్కెదొడగె.

ఓ, ధర్మభాగ్యుడా! యింతటనైన స్వార్థాంధుడవుగాక దరిద్రుల క్షుధార్తి యెట్టిదో యెరిగి వ్రతమొనర్చితివే ని నీకు సకలశుభములును తిరుగాకల్గును. గర్వించి అసలు వ్రతమే చేయకయు పెక్కించినమీఁపోరుగూరి భూస్వామిగతి యేమైనదో తెల్పెదవినుము.

ద్వి:- మీపురంబునకు సమీపమునందు
గలభోగపురమున కాపురమున్న
వరదరాజనెడు భూస్వామిగర్వించి
యీవ్రతంబును జేయ నీసడించియును
కఱవుకాలంబున కష్టజీవులను
కనికరించకతనకు గల్గినయట్టి
భాగ్యంబుచేభోగ పరుడౌట; నీవు
నాగ్రహామునకుపా లయ్యెనాపిదప

కూలీలుకృషికులను కుమిగూడిసమె
గట్టియు బంజరుబెట్టిదిపాలిము
కాపరులునుపాలి కాండ్లుజిక్కనను
స్వాంతసేద్యముకూడ సాగకపోయె
యెక్కడెక్కడిబుణా లెక్కకోర్టునకు
యితరవ్యాజ్యాలెన్నొ సుతిమించివచ్చె
జప్తులువారంట్లు సాగెనాతనిపై
గృహమునరోగముల్ విహరింపదొడగె"

అని యింకను చెప్పుచుండగనే ధర్మభాగ్యుండడ్డము వచ్చి, స్వామి ! అంతవరకు నాకుస్వయముగా తెలియును, తర్వాత నాతనిగతియేమైనదో తెలియదు, అతడుబ్రతికియున్నాడా? " అనెను.

అందులకాదివ్యుడు "ధర్మభాగ్యుడా! చెప్పుచుండగనే తొందరయేల? వినుము!"

ద్వి:- హంకారగర్వము లాటోపమడగి
పోయి, దరిద్రినారాయణస్మరణ
గల్గిహృదయముమారి కడుశ్రద్ధతోడ
వ్రతమొనరించె నిర్మలబుద్ధిగల్గి. "

అనిచెప్పి కొంచెమాగెను వెంటనే వణిజుడందుకొని; "అందులోపము లేమైనగల్గెనా యేమి ?" అనిప్రశ్నించెను

అందులకుదివ్యుడు "ఓయీ! అందఱును నీవంటికరుడు గట్టిన మూఢాచారపరులే యుందురా?

ద్వి:- లేశముం గోపంబు లేకుండనితర
కార్యంబులన్నియు క్రమముగాజరిగె
నడవడి. హృదయంబులెడ నెడమారె
కష్టనష్టములన్ని కడవడిమారె
పంటలుగూడను పండెనాతనికి.
తొల్లిటికంటె నెందునగానికో అంత
లేని సౌఖ్యంబిపుడూనియున్నాడు
ప్రజలమన్ననలకు పాత్రుడైనాడు

అని చెప్పి ముగించి నారదుడంతర్ధానమాయెను.

— ద్వితీయాశ్వాసము సంపూర్ణము —



# దరిద్ర నారాయణ వ్రతమహాత్మ్యము.

## తృతీయాశ్వాసము

అంతట వణిజుడు తనకేదైన జనులు నడచినకాలిబాట కనుపడునేమోయని సముద్రతీరము వెంటవెదుకుచు పోవుచుండగా నతని పుత్రమిత్రాదిపరివారమంతయు చావు బ్రతుకులమీద సముద్రములో తేలియాడుచున్న కొయ్యలకలప యాధారముతో కొందఱును, యీదుకొనుచు వచ్చి కొందఱును, గట్టుచేరుచుండుట జూచెను. నీరసముమెఱుమాయమై పోవనత్యంతానందముతో ధర్మభాగ్యుండువారి వద్దకుపరుగిడి, జరిగిన సంఘటనలు పరస్పరము ముచ్చటించుకొని, అందఱును గలసి ద్వీపభూమిలో జొచ్చిపోవంబోవ, కండ్లపండువుగ నొక గ్రామము గనుపడెను బ్రాహ్మణ పురమను పేరుగల యా గ్రామమున యొకటి రెండురోజులుండి, తదుపరి దరిద్రనారాయణ వ్రతమొనరింప నుద్యుక్తులై, వారి దేహములపైగలకనకాభరణములనమ్మి వస్తుసంభారములు సేకరించి, వ్రతపూర్తి నొనర్చి, బ్రాహ్మణవైశ్య, శూద్రసంతర్పణలు జేసిరి. మఱునాడుదయంబున.

మత్తకోకిలము:-

కొన్ని బెస్తలబోట్లునద్దెకు గొంచు తెచ్చియు నందఱున్
చిన్నగానందెక్కి కూర్చొని, తెడ్లువేయుచు నోడపై
నన్నివైపుల పారజూచుచు నందరన్నిపథంబులన్
జన్నమీదటనామహాబ్ధిని సాగె, వర్షముఘోరమై

ద్విప:- అబ్బురంబుగ కారు మబ్బులు గ్రమ్మె
దిశలు చీకటిచేత తెలివి గోల్పడియె;
మెఱుపులు మెఱుపుల యురవడిమించి
మిగుల భయంకరంబగుచుగ న్పట్టె,
బ్రహ్మాండమే మాట్లు పడిపోయినదియో!
కుండలతో నీరు క్రుమ్మరించెడినో!
యన్నట్లు జలధారలంతకంతకును
యేన్గుతొండములంత యెదిగిపోవుటయు
పిడుగులు ఫెళ ఫెళ బడుటయు, పిదప
గాలి ప్రారంభించి కడుతీవ్రముగను
అష్టదిక్కులనుండి యటునిటువీచె;
కెరటముల్ కొండలకరణిపై కుబికి
పడుచు లేచుచు మహా ప్రళయకల్లోల
మైపోయె వారిధియంతట కూడ;
ధర్మభాగ్యని బోటు తనవశంబెడలి
ఆకువలెగొట్టుకొని యటుపోయిపోయి
దైవవశాత్తుగా దరిదగిలి యొరిగె,
తలక్రిందులైపోవు తనబోటునుండి
నీటిలో దుమికియు నేర్పున యొడ్డు
జేరి, ప్రాణంబులు చిక్కబుట్టుకొని
పడియుండె తిన్నెపై తమ ముద్దువలెను
తక్కువారల మాట దైవమెఱుంగు.

అంతట కొంతసేపటికి గాలి వాన శాంతించుటయు దశదిశలు కండ్లకు కనుపడునంత మాత్రము వెలుగు వచ్చుటయు, సాయంసమయము కాలేదని వణిజుడు గ్రహింపగలిగెను కాని తీరారణ్యములోని ఘాతుక మృగముల గాండ్రింపులు విని భయపడుచూ శ్రీమన్నారాయణుని ధ్యానించుచుండెను. ఇంకను, చీకటి పడువఱకచటనే పడియుండుట అపాయకరమని తలంచి యొకానొక కాలిబాటను గుర్తుపట్టి, దానిననుసరించి, బురదలోపడుచు! లేచుచు! సాగిపోవుచుండగా! నొకానొక బీదహరిజనుడు త్రోవను తటస్థపడెను. మనవణిజుడాతని ప్రశ్నించి! ఛండాలుడని భావించి! దూరముగా తొలగి నడచుచుండెను! అంత నాహరిజనుడు! అయ్యా!

ఆ. వె. అడవి బడలియుండి నడువలేకున్నాను
కరమునాది యూతగా గ్రహించి
మిట్టజేరువరకు మెలకువతోడనీ
నీటిగుంట వెళ్ల జూడుమయ్య.

అనియనెను. అందులకు వణిజుడు ఓరీ!

గీ॥ ప్రాణములు లేచిపోయిన మానెగాని
యకట! ఛండాల మనుజుడవైననిన్ను
తాకుటెట్లాను! నీనీడ దాటజాల!
భుజమునూతగ గొననెట్లు పొసగు నాకు

ఏదో! అనువుగాని చోటగుటచేతను, అపకాలము గుటచేతను సరిపోయినదిగాని, మాస్వగృహములో శుచిగా

నున్నప్పుడైతే, మాలమాదిగలశబ్దము వినుటగూడమాను లాచారపద్ధతులప్రకారము తప్పేయగును." అని యీసడింపుగా బలుకుచు, కొంతదూరమట్లేనడచి ఆయాసముతో కూలబడి, హా! నారదా!

ఆ. వె. వ్రతముచేయనట్టి వారికి నష్టంబు
వచ్చునంటి వంత। వ్రతము జేయ
నందులోపమగుట। నాపద పాలైతి;
తిరుగ లోపమేమి। జరిగెనయ్య?

దూరస్థమును, మాకు నూతనమును, అగు గోముఖ ద్వీపమున యొనర్చిన దరిద్రనారాయణ వ్రతములోగూడ స్వార్థ మేమిగలదు? ఏలనాకీ ఘోరనరక యాతనలు కల్పింపబడియెను?" అని వాపోవుచుండెను. ఇంతలో హరిజనుడు వణిజును ద్దేశించి; "అయ్యా! దరిద్రనారాయణ వ్రతములో అష్టోత్తర శతనామావళి అర్థము చేసుకొంటివా?" యనెను.

అందులకు వణిజుడు, తనలో, వీడేమోకొంచెము చదువుకున్నవానివలెనున్నాడే! యని తలంచుచు, "ఓయీ! వ్రతకాలమున పురోహితుడేదో పూజచేయుచూ, నారదుడు వ్రాసియిచ్చిన మంత్రము పుస్తకములో నేమేమిటో చదివినాడుగాని, నేను సరిగా విననూలేదు, వినపడినవి నాకర్థము కానూలేదు" అనిజవాబిచ్చెను.

అంతట హరిజనుడు "ఓహో! అర్థములేని పూజలు వ్యర్థము గాదటయ్యా! ఆయితే కాని, ధర్మభాగ్య మహాశగూ

బ్రాహ్మణపురములో మీరొనరించిన వ్రతము పరిపూర్తియైన పిదప;

గీ॥ అన్నికులములవారికి నన్నమిడియు
అన్నమో! అన్నమో! యని యటమటించు
ఆర్తులమగు పంచములకొక్క । యన్నకబళ
మైన వేయక నడిరాత్రియందు వారి
నావలకు బంపివేయుట న్యాయమౌనె?

అనునంతలో వణిజుడు "ఆగుమాగుము! అందులకు నన్నేమి చేయుమంటావు? పంచముల కన్నము పెట్టుట ఆగ్రామములో ఆక్షేపణయట. పైగా, పరగామిమస్తుడనుగదా, నాకీ గ్రామాచారములతో పనేమియనుకుంటే "ఛండాలులకు అన్నము పెట్టితే దేవుడు మైలపడిపోతాడనియు, వ్రతఫలము దక్కదనియు, అచటి బ్రాహ్మణులు చెప్పుటచే నట్లుచేసితిని." అనెను ఆంతనాహరిజనుడు వణిజునిగూర్చి చెప్పుచూ, "గ్రుడ్డియాచారపరులగు నీబోటివారి మౌఢ్యమును తొలగింప బ్రహ్మకుగూడ వశముకాదు. నీబోటివారిగతి యింతే" నని పల్కుచూ, దశదిశలు తనదివ్యప్రకాశముచే వెలిగించుచు వెళ్లిపోవుచుండెను. వణిజుడు నివ్వెరపడిజూచుచూ, తనలో, నేను చెప్పకనే బ్రాహ్మణపురములో జరిగిన సంఘటనలీతని కెట్లు తెలిసెనో! యీతడు వేషమాత్రుడగు దివ్యుడేకాని హరిజనుడు కాదని నిశ్చయించుకొని, ధర్మభాగ్యుడొక్క యుదుటన ముందుకుదూకి, కోటిసూర్యప్రభాభాసితుడగు నా దివ్యని

కడ్డముజొచ్చి, చేతులుముకుళించి, హే! లీలామానుషవిగ్రహా! పరమేశా! తప్పుగ్రహించితిని. క్షమింపుము! క్షమింపుము! నన్నుదరిజేర్చు నుపాయము తెల్పుము! అనిప్రార్థియపడెను. అంతనాదివ్యుఁడు తీక్ష్ణముగ జూచుచు, వణిజుడా!

గీ॥ హరిజనుల, నాదుప్రేమకు నాస్పదులను,
హేయముగ జూచితివి బుద్ధిహీనముగను,
మఱియు నాకట వారల మాడ్చితీవు;
అంతటితో నాగకేనీవు హైన్యముగను
తిట్టిగెంట్టించితివి మెడబట్టినన్ను!"

అని కఠినముగ బలికినవిని, వణిజుడు, గడగడ వణకుచు, యేమీ! పరమపురుషుఁడవగు నిన్నే నేను మెడబట్టి గెంటించితినా? సర్వశక్తి సంధాయకులరగు మీకే అంతటి యపకృతి జేయగల్గిన ఘోరపాపినా? స్వామీ! భగవంతుఁడవగు నీకే నేనవమానము చేసితినా? ఏమిది! నాకిదియంతయు దిక్కుతోచని చిత్రగాథగానున్నదే! "అని నెత్తి బాదుకొనుచు మొత్తుకొనెను. అందులకా దివ్యపురుషుఁడు "ఓ! వణిజుడా! బ్రాహ్మణపురమున విప్రవైశ్య భోజనములైనపిదప నొక ముసలి భిక్షుకుడు తాను రెండురోజులుగా నన్నములేక నాకటితో చచ్చిపోవుచున్నానని వచ్చి నీముందు మోకరిలబడలేదా? వానిని నీవు నీభటులచే మెడబట్టి నెట్టించలేదా? అనెను. అందులకు వణిజుడు "ఔను! జ్ఞప్తికివచ్చినది స్వామీ! ఆభిక్షుకుడు, బ్రాహ్మణులు, వైశ్యులు మొదలగు పైకులస్థుల

భోజనములు కానిదే వచ్చుటచేత, యిప్పుడు వీలు కాదు తర్వాత రమ్మంటిని, అందులకు వాడు తిరుగబడి మాట్లాడితే నెట్టించితిని! అంతియే కాని, మీకు నేనేమి అవమానము జరిగించితిని"? అనెను,

అంతట నాదివ్యపురుషుడు ఓ! మూఢ, ధర్మభాగ్యుడా!

ద్విపద:-ఇంకను మౌఢ్యతి యెసుగుంత యోని
వదలకుంటివి దేమి? వణిజుడా, నీవు
కనువిప్పి విశ్వంబు కలయజూడుమిక
సత్యంబు కనుగొనజాలవా? నీవు,
దూషితుండగు దరిద్రుండను నేనే!
పెడబడినట్టి యాభిక్షుండ నేనే!
మెడబట్టి గెంటింప బడినది నేనే!
ఆకలిమంటచే నార్తుడ నేనె!
దీనమానవుని మూర్తియుగూడ నేనె!
బీదలపాలిటి పెద్దను నేనె!
దారిద్ర్య నరయవతారము నేనె!
ఓయి! దరిద్రనారాయణుడ నేనే!

వత్సా! ధర్మభాగ్యుడా! యికనైన నాపలుకులలోని సత్యమును గ్రహింపుము. దరిద్రుల సేవయే నాసేవ! నేనే దరిద్ర నారాయణుడను. వేదముయొక్క సామ్యవాద సిద్ధాంతములకు

విరుద్ధముగ ఆర్థికసూత్రములు అమలు పరచబడి యీకష్ట జీవులగు కటికదరిద్రుల కందఱికిని ఘోరమైన యన్యాయము జరిగినది, జరుగుచున్నది. సాంఘికముగ హరిజనుల కన్యాయము జరుగుచున్నది. గనుక నేను యీదరిద్రుల నుద్ధరించుటకై దరిద్రనారాయణావతారమును దాల్చితిని. ఇంతటనైన నీవు తెలివిగలిగి మూఢవిశ్వాసములను, స్వార్థచింతను విడనాడి నావ్రతమాచరించితివేని, నీకు శుభముకలుగును.” అని చెప్పి యంతర్ధానమైపోయెను.

తృతీయాశ్వాసం సంపూర్ణం



# దరిద్రనారాయణ వ్రతమహాత్మ్యము.

—* చతుర్థాశ్వాసము *—

ధర్మభాగ్యనికథ యట్లుండ నతనికొమరులు ముగ్గురును ఆపత్ప్రళయకల్లోల తరంగిణులలో తలక్రిందులుగ నీటబడి మునిగిపోయిరి. కడుపుబ్బనీరు త్రాగి, పూదియుండిన వారిశవములు మఱియొక వైపునకు కొట్టుకొనిపోయి, సముద్రపు టొడ్డున యిసుకతిన్నెపై జేరవేయబడెను. తక్షణమే నారదుడచ్చటికివచ్చి పరీక్షించి, కొనయూపిరితో నున్నారని గ్రహించి, వారియుదరములను నొక్కి గర్భకోశములోని నీరును బైటికి వెడలునట్లు జేసెను. కొంతసేపటికివారు ప్రక్కకుదొర్లిరి క్రమక్రమముగ వారికి స్మృతిగూడ వచ్చుచుండెను. ఒకానొక యౌషధమును ప్రయోగించెను. వారు కనులుదెఱచి నారదుని తిలకించి కృతజ్ఞతాపూర్వకమగు నమస్కారములు జేయ ప్రయత్నించిరిగాని, శక్తిహీనులై నీరసించియుండుటచే తిరుగా కనులుమూసిరి. అంతట నారదుడు వారిశ్రవణపుటములబడునట్లు బిగ్గరగా,

ద్విపద:–ఆకటితో బాధ పడుచున్న హరిజనులను
అర్ధరాత్రిపర్యంత మచటనిలిపి
అన్నమీడకుండ బంపుట, యౌనె? మీకు
మనుజులే కాదె? మాలలు, మాదిగలును!

వారికన్నము బెట్టుట నేరమగునె?
మూడునాళ్లుగ నాకట మాడుచున్న
బిచ్చగానిని గెంటింపవచ్చునయ్య?
మీరు పాసించు దేవుని పేరుమీద
జేయు దారిద్ర్యజనసేవ । లీయకార్య
కరణములె? కటిక బీదల కనికరమున
గవక, వ్రతమునలోపముల్ గలుగుచుంట
వలననేమీకు కష్టముల్ ప్రాప్తమయ్యె!

అని ప్రబోధించి, యంతర్ధానమాయెను. వెంటనేవారు దేహములు జలదరించ, లేనిసత్తువదెచ్చుకొని, లేచికూర్చొని నాదమసికొటకై కలయజూచి, కనుచూపుమేరలో యెచ్చట నుగానక, ముగ్గురును పరస్పరము కలయబలుకకొని కాలి బాటను తిన్నగాపోయి, పోయి, మాలమువిపల్లెయను గ్రామము చేరుకొనిరి. రెండుదినములవరకు దేహముల కారోగ్యము చేకూర్చుకొనుటయందుగడపి, తదుపరి వ్రతముజేయ సంక ల్పించినవారై, తమచేతివేళ్ళకుగల రత్నపుటుంగరముల నమ్మి, సర్వసంభారములు సమకూర్చుకొని, వ్రతపూర్తి యొనర్చి, యాగ్రామములోనుండు బీదలందరికిని, హరిజను లకు సహోత్సాహకరముగా భోజనము పెట్టించిరి. కాని యా గ్రామములో సదస్యులందఱును నిమ్నజాతివారే గనుక, దేవు నికి నివేదనచేసిన పంచభక్ష్యాయము మైలపడినదనియెంచి, తాము మాత్రము స్వీకరింపక తదితరుల కందరికిని పంచి పెట్టిరి. ఇదియిట్లుండ,

ఆగోముఖ ద్వీపమునకు ముఖ్యపట్టణమగు కళ్యాణనగరములో నొక ధనికునికి యింట చోరీజరిగియుండగా, రక్షకభటులు చుట్టు పట్టుపల్లె లన్నిటిలోను ఆచోరీకై తిరుగుచూ, యీమాల మునిపల్లెకువచ్చి, ధర్మవత్సలాదులమ్మిన వజ్రపుటుంగరముల ననుమానించి, వీరిముగ్గురిని అరస్టుజేసి తీసుకొని పోయిరి. ధర్మవత్సలాదులు కారాగారములో నుంచబడి, నిరంతర మనేక విధముల దరిద్రనారాయణునిగూర్చి ప్రార్థించుచూ, తాముచేసిన తప్పేమి తెలియక, పలవింపదొడగిరి.

ఇట్లుండ నొకనాడు భగవంతుడు పాకీవానిరూపముతో ధర్మవత్సలాదులకు, తామున్న యినుప కటాంజనము వెలుపల కనుపడెను అంతటధర్మవత్సలుడు, ఓరీ! మాలవాడా, ప్రతిదినమును, ఉదయము పొద్దెక్కిన తరువాత కనుపడువాడ వీరోజు యింతపెందలకడనే వచ్చితి వేమిరా? యనిప్రశ్నించెను. అందులకుమాలెడు "అయ్యా! జైలువార్డరు యీపూటయేదో కొందరపని గలిగి పొరుగూరికివెళ్లుచూ, ఖైదీలకు కూరగాయలు మజ్జిగ చింతపండు వగైరా వస్తువులు తెచ్చి యివ్వమని నాకు చెప్పినాడు. మాలకొట్టునుండి ముట్టరానివాడనగు నేను తెచ్చేవస్తువులు మీరు స్వీకరిస్తారో లేదో తెలుసుకొని పోవుటకైవచ్చితిని" అనెను అందుపై ధర్మవత్సలాదులు గుసగుసలుసలిపి, చప్పిడికూడుతినుట సాధ్యముకాదని యెట్టకేలకు సమ్మతించిరి వెంటనే భగవంతుడు తనకు హీనావేషమును మార్చి దివ్యుడై "ధర్మవత్సలాదులారా! అంటుసోకెనని యానాడుపంచభక్ష్యాయమునే విసర్జించితిరే!యీనాడు

అంటరానివాడు స్వయము తెచ్చిన ఆహారవస్తుసంభారము లెట్లు పనికివచ్చునయ్యా! అని పరిహాసముగా బలికెను. ఉలికిపడి ధర్మవత్సలాదులు తమతప్పును గ్రహించి,

ద్విపద:- చేతులు ముకుళించి శిరముపై నుంచి
యినుపచువ్వల కటాంజనములోపలను
మోకరిలంబడి మ్రొక్కుచునువారు
మీప్రబోధముచేత మాప్రమాదంబు
తెలిసె, తాపముజేత కలగుచున్నాము;
ఆర్తశరణ్యా మాయపరాధమ్మును
క్షమియించిమమ్ము రక్షణజేయుమయ్యా
యీచెరదప్పింపు మిక, దేవదేవ!
యని బహుభంగుల నార్తులై వేడ
నందులకాదివ్య డపుడిట్టులనియె.''

గీ॥ ''మీరు బంధువులైనను। మీర లైన
చేసినట్టువంటిపుణ్యము వీసమేని
యున్నచో చెఱదప్పుట యొదవుగాని
యట్టిదేదియు లేదు మీకడ్డుపడగ

అని ప్రత్యుత్తర మొసంగెను, అంతట వణిజకుమారులు ''స్వామీ! మేముప్రసాదము పుచ్చుకొనక నిరాకరించడము తప్పేగాని, అంతమంది బీదల కన్నదానము చేసితిమిగదా! ఆపుణ్యమైన మాకిప్పుడడ్డు పడగూడదా?'' అనిప్రశ్నించిరి. అందులకాదివ్యుడు ఓయీ! మీరు ఆపత్తుదాటుకుందామను

ఆశతో మాత్రమే దరిద్రులకు భోజనము పెట్టితిరిగాని, వారు జన్మతః అస్పృశ్యులనియు, హీనులనియు, పాపులనియు, యెంచితిరి. అయ్యో! వీరుకూడమనవలెనే మనుజులేకదా! యనియు, వీరింతటి దరిద్రమువల్లనే యింతటి దైన్యస్థితిలోనున్నారనియు, అంతమాత్రమున వీరుజన్మతః వినగూడనివారును, చూడగూడనివారును అంటరానివారును కారుగదా!, యనియు, వారియందుగలిగిన యవ్యాజప్రేమతో, వారినుద్ధరించుటకై సంకల్పించిన హృదయముతో, దీనజన సేవాతత్పరత బుద్ధితో, మీరుదరిద్రనారాయణ వ్రతమునుచేయలేదు. అంతటి వివేకముతో వారికి భోజనము పెట్టించనూలేదు. అట్టి భావన అట్టిజాలి మీకుండియున్నచో, హరిజనుల గాలిపారిన దన్న మాత్రమున, ఆప్రసాదముపై మీకంతటి యసహ్యత కలిగియేయుండదు.

గీ॥ తెలిసియో తెలియకో లోపములతోనైన
మీరు, మీజనకుండునుకోరిచేసి
నట్టిభోజనదానపు । ణ్యంబువలన
నబ్బెనాదర్శనంబుమీ । కందఱకును"

అని చెప్పెను. అంతధర్మవత్సలుడు, "హే, స్వామీ! మాతండ్రిగారు ప్రతి శనివారమును దీపారాధనజేసి నైవేద్యము పెట్టనిదే భోజనము చేయువాడుకాడే! ఆపుణ్యలేశమైనమా కంటిరాగూడదా?" యనెను.

అందులకు దివ్యుడు ఓయీ! దైవముపేరుతో, నాలుకకు రుచికరమైన భక్ష్యభోజ్యములు చేయించుకొని, అవి దేవ

మూలను వెలిగించిన దీపారాధనను చూపి, కొన్ని నీటిబిందువులు
చిలకరించి, వెంటనే వానిని మీరు కడుపునిండ తుష్టిగా భుజిం
తురుగదా? చూపులు మాకును, మేపులు మీకా? నాకర్పించ
దలంచినట్లు నటించిన యాపరమాన్నాదులలోనుండి యేనా
డైన అంగవికలుడగు నొక్కకటికి దరిద్రునికైన, కడుపార
కుడువబెట్టిన పాపమునబోయితిరా? నావంకబెట్టి. మీకడుపు
నింపుకొను పూజలు పుణ్యప్రదములు కాజాలవు" అనెను ధర్మ
వత్సలుడు తిరుగాకల్పించుకొని, "అయితే, స్వామీ! మా తలి
దండ్రులిద్దఱును, ఏకాదశి, శివరాత్రి మొదలగు పర్వదినము
లలో మిమ్ముగూర్చి ఉపోష్యముండువారుగదా! అపుణ్యమైన
మాకడ్డురాదా? అందులకు దివ్యుడు ఓయీ! చేసినకనికరపు
చేతయు, నిష్కళంకమగు భావనయు, తదనుగుణ్యమగు ప్రవ
ర్తనలే పుణ్యప్రదములు. నిర్మలమగు భావసంస్కారములేని
యుపోష్యములు, జీర్ణకోశమును పరిశుభ్రమొనర్చుకొనుటకు
మాత్రమే యుపకరించును. అర్థములేని యాచారములు వ్యర్థ
ములు ఇది ముమ్మాటికి నిశ్చయము. మీ ఆత్మీయులెవరైన
తిరుగ నావ్రతమొనర్చినప్పుడు మీకీచెఱదప్పు" నని చెప్పుచూ
నంతర్ధానమైనపోయెను.

—* చతుర్థాశ్వాసము సంపూర్ణము *—



# దరిద్రనారాయణ వ్రతమహాత్మ్యము.

## పంచమాశ్వాసము

—(:)—

ద్విపద:— ఈకథలిట్లుండ । నాకడలిదరిని
వణిజునిపరివారమును । బంధువులును
గాలివర్షము శాంతి । గనువఱకటనే
యొదిగియుండియుతమ । యొడయులకొఱకు
తీరమంతటను శో । ధించి, శోధించి
ఆసలుపిడి, క్రొ । హ్మణపురంబునకు
వెళ్లి. యచ్చటివారు । వెఱ్ఱెత్తినట్లు
తిరుగుచు, తిండికి దేవురించుచును,
గడపుచునుండిరి కాలంబువ్యధగ.

వీరిలోనొక్కడగు ధర్మభాగ్యుని బావమఱది సత్యశీలు డొక్కనాడు కల్యాణపురమునకు వెళ్లియుండి, దూరదేశస్థులగు ముగ్గురువణిజవేషధారులు కారాగారబద్ధులైరను, పుకారువిని, కేంద్రకారాగార కార్యాలయము వైపునకువెళ్లి, యచ్చటవిచారించుచుండెను.

ఇంతలో కొందఱు రక్షకభటులు లొకవ్యక్తిని శృంఖలములచే బంధించి, తీసుకొనివచ్చుచుండుటగాంచి, వానివైపునకు సత్యశీలుదృష్టి సారించెను. ఆశ్చర్య, భయ, విషాదములొక్కుమ్మడితనను గ్రమ్ముకొన, నావ్యక్తితనబావయగు ధర్మ

భాగ్యుడనిగుర్తించెను. వెంటనేయతడు, జైలులోనున్నవణిజ వేష ధారులగు వారుమువ్వురును, గ్రహచారముచాలని ధర్మ వత్సలాదులై యుందురని యూహించెను. దుఃఖావేశమాన సుడై సత్యశీలుడు పరమేశ్వరునిగూర్చి; ఓ శరణాగతత్రాణ బిరుదాంకితా! ఆర్తశరణ్యా!

ఉ॥ తప్పులుగల్గెనేయనుము! తావకదివ్యపదాబ్జసేవలో
తప్పులుమర్త్యమాత్రునకు తప్పవునొక్కపుడేనిచేయుకః
తప్పులనొప్పగాదలచి,తండ్రి.సుతుఃక్షమియించునేగదా!
తప్పదియల్పమేయయిన । దండనజేతువె? వీరినింతగా!

ఓ, దరిద్రనారాయణ పరమేశ్వరా! పరాత్పరుడవగు నీవింతమాత్రపు,టుదారహృదయమును, సహనమును, జూప కున్నలోకములుభరించగలవా? (తిరుగనాలోచించి) అరరే! యెంతపొరబడుచున్నాను! కోటానకోట్లమానవులను, జీవులను యేకధాటిగా, ధర్మాధర్మవిచక్షణ జేసి పాలించవలసిన మహా శాధ్యతగల పరమేశ్వరుడు, దయామయుండేయైనను, శిక్షా స్మృతి మాత్రముకఠినాతి కఠినముగ నుండకున్న, లోకము హద్దుమీరినడువదా? కానిమ్ము! కరుణాస్వరూపువిదయ, సక్ర మవిధానముగనే బసయుటకు పురుషకార మొనర్చెద, ఇందు లకు ప్రప్రథమమున చెఱసాలలోనున్న నాబంధువులనుజూచి, మాట్లాడి, తదనంతరము కార్యదీక్షకుగడంగెద!" ననితనలో తానుతర్కించి నిర్ణయించుకొనెను.

గీ॥ చుట్టములజూచిసంప్రీతిం । చుటకుతనకు
యెంతయత్నించినను పని । సుంతయేని
కాకయుండిన, జైలధికారియింట
నూడిగముసల్పిపరిచయ మొదవజేసు
కొనివపిమ్మటయెట్టులో యనుమతించె.

కష్టసాధ్యముగజిక్కిన యీయవకాశమును, వ్యర్థము గాయొకరి నొకరుజూచుకొని దుఃఖము వెడల బోసుకొనుట కుపయోగింపక, జరిగిన సంఘటనలన్నియు వారి వారి వలన వివరముగా తెలుసుకొని, వ్రతకాలములో దైవప్రసాదమును స్వీకరింపక తూష్ణీంభావము చూపినందువలనను, దరిద్రులగు హరిజనులయందు నిజమగు సౌహార్ధత లేకపోవుటవలన. తిరుగా భగ్నవత్సలాదుల కీకష్టములు సంభవించినవని స్థిరచుఅచు కొనెను,

ఇచ్చటి కథలిట్లుండ. నటకళింగ పట్టణమున, ధర్మ భాగ్యుని స్వగృహమున,

ద్విపద:- దొంగలుపడిగొప్ప దోపిడిజరిగి
అతిమూల్య వస్తువుల్ హరి ౹ యింపబడియు,
పరదేశములనున్న వణిజులనుండి
లేఖయొక్కటియేని । లేకపోవుటయు,
క్షేమవార్తలుతమకు । చేరకుండుటయు,
ధర్మభాగ్యునికళ । త్రముదుఃఖమునను
కన్నీరుమున్నీరు । గా నేడ్చియేడ్చి,

తనభర్త సాన్నిధ్యమున కేగదలచి
తాబినుడ్డలుగుమా । స్త్రీలతోగదలి
ఓడపైపయనంబు । నొవరసాగించి
తమవారినన్వేష । ణము జేసిచేసి,
ప్రతియొక్క చిన్నద్వీపంబును వెతకి
జాడ తెలియకనుచే । జారయిపోయి
తెచ్చినధనమెల్ల ! వెచ్చించికడకు
అచటిపుకారుల నారసికొంచు
గోముఖద్వీపము గొబ్బున జేరి
కాలినడకనె వారు కళ్యాణపురము
జని, యటసత్యశీలునిగనుగొనిరి.

అంతట వారందఱును పరస్పరము దుఃఖములను వెళ్లి బోసుకొని, ఓదార్పునొంది, జరిగిన సంఘటలన్నియు పరస్పరము తెలుసుకొని, దరిద్రనారాయణవ్రత మొనరింప సంకల్పించిరి. కాని భోజనాదులు జరుగుటే కష్టసాధ్యముగనున్న వారిచేతులో డబ్బుతగినంత లేకుండెను. ఇంతలో, వీరికష్టనష్టములను గూర్చినప్రసంగములను వినుచుండి జాలిగదిరిన హృదయముతో, నొకసారుడచటికివచ్చి "అన్నలారా! నేనొకవిషయము చెప్పెదవినుండు. ఈకళ్యాణ పట్టణాధీశ్వరుడగు శ్రుతవర్మమహారాజులుంగారు రాచకీయకారణములచే పదభ్రష్టులై, ప్రాణభయముచే అరణ్యములకు పారిపోయి, అచ్చట నారదహితోపదేశముచే, మనసుమార్చుకొని, దరిద్రనారాయణవ్రత మొనర్చి, తన్మహాత్మ్యముచే తిరుగా రాజ్యాధికార

మునహించి, ప్రజానురంజకముగ పరిపాలన జేయుచున్నాను. అప్పుడుతెనపై తిరుగుబాటుచేసిన పౌరులే, యిప్పుడా మహారాజునకు బాసటలైయున్నారు.

కావున మీరును యథోచితముగ వ్రతమొనర్చి, కష్టపరంపరలనుండి తరింపుడు" అనిచెప్పి వారిని వ్రతమొనర్ప ప్రోత్సహించెను. అంతట దురాలోచనయు, వివేకజ్ఞానమును గల సత్యశీలుడు, తనలో, "కొండంత దేవునికి కొండంత పత్రి పెట్టగలమా?" అనియెంచి, యొకనాడు ఆపట్టణపరిసర ప్రదేశమునగల యొకనదియొడ్డున దరిద్రనారాయణ వ్రతముచేయ ప్రారంభించెను.

సీ॥ వ్రతమండపంబు సం । పాదించి తేలేక
పచ్చియెదురుల మండపంబొనర్చి
కనకవిగ్రహ మును గడియించి తేలేక
రాగిరేకునను వి । గ్రహముగీచి
కాగితముల యలంకారముల్ మానేసి
ఆకులుపువ్వులు నందమర్చి;
విలువగల్గినవస్త్ర । ములులేక మండప
మున పేదవసనముల నుపుపఱచి,
గీ॥ వ్రతసదస్యులు దారిద్ర్యపరిజలుగాగ
వ్రతమొనర్చెడువారు దుర్భరదరిద్ర
ములకు పాలైనవారు ॥ నలదరిద్ర
దేవతామూర్తి పూజలు । తెమలిపోయె;

సత్యశీలుండును, ధర్మభాగ్యుని కళత్రపుత్రి పరివారం
బును, దరిద్రముయొక్క కాఠిన్యతను రుచిచూచినవారగనుక
దరిద్రులగు సదస్యుల యొక్క స్థితిగతులకు జాలిపడియు, తోడి
మానవులకు సాంఘికముగ జరుగుచున్న యన్యాయమునకు
వగచియు, దీనజనోద్ధరణకై జీవితశేషమంతయు కృషి చేయ
సంకల్పించితిమని దరిద్రనారాయణస్వామి యెదుట హృదయ
పూర్వక ప్రమాణములుగైకొనిరి. అంతట:-

ద్విపద:- దైవప్రసాద మంగీకరించియొసగి
పిమ్మటతామును స్వీకరించియును,
గతిగల్గినట్టుగ కలిమియొ అంబలియొ
కడుపారఁ దృప్తిగా కష్టజీవులకు
కుడువబెట్టియును నెక్కుడు ప్రేమతోడ
తమవద్దనున్న వస్త్రములు కొన్నిటిని,
వస్త్రహీనులైన వారలకిచ్చి
ప్రియముతో సాగనంపెను ముహూర్తమున

ఇంతలో నకస్మాత్తుగా గుఱ్ఱములపై స్వారిజేయుచూ,
ఆద్వీపమును పాలించురాజు, తనవేట పరివారముతో సహా
పోవుచూ, గ్రామమువెలుపల వ్రతమండపము నిర్మింపబడి,
చుట్టును మనుష్యులుమూగి యుండుటజూచి, విషయమేమో
కనుగొనుటకై వచ్చిరి. రాజు, వణిజులయొక్క కథనంతను
ఆమూలాగ్రముగ తెలుసుకొనినవాడై, దరిద్రనారాయణ
స్వామియెడల తనకుగలభక్తి ప్రపత్తులు వెల్లివిరియ సాష్టాంగ

దండప్రణామములిచ్చి, శేషించియున్న ప్రసాదమును స్వీకరించి తనవద్దనున్న వస్త్రాభరణములను అచ్చటచేరియున్న దరిద్రులకెల్లరకును దానమిచ్చి, గృహోన్ముఖుడై పోవుచు, వణిజులనుగూడ కొలువుకూటమునకు రమ్మనిచెప్పి వెడలిపోయెను. సాయంత్రము న్యాయ సభామండపమున శ్రుతవర్మ మహారాజుంగారు కొలువుతీరి కారాగృహనిర్బంధితులగు ధర్మవత్సలాదులను రప్పించి వారిపై మోపబడిన నేరములను విచారించి, నిర్దోషులని నిర్ణయించి వారిని విడిచిపుచ్చినవాడై ఆమహారాజు వణిజులతో నిట్లుపలికెను.

ద్విపద:- ఆగర్భ శ్రీమంతులైన మీరేల!
ఆస్తినపహరించు యనుమానమేల!
బందిగమందున పడియుండుటేల!

నారాయణుని కోపకారణముగాక
యింతటి కష్టంబులేల గల్గెడిని?
పరమేశ్వరునిదయ ప్రాప్తించెనిపుడు
కష్టనష్టములన్ని గడచనిపోయె;
సకలశుభంబులు సమకూడువికాకు;
బాసటగాకొంత ఫౌజుమీవెంట
పంపించెదను మీరు బ్రాహ్మణపురపు
కడలితీరమున నెల్లెడలను వెతకి
ఓడను కనుగొనుడో వణిజులారా!"
యనిచెప్పి వారల నినిపెనారాజు॥

అంతట వణిజులును, న్యాయస్థానమునంజీ వెడలి రాజనియోజిత సైన్యములు వెంటవచ్చుచుండ పట్టణములో పోవుచుండిరి. దరిద్రనారాయణ మహాత్మ్యవిశేషకథలు పట్టణమెల్లెడల బ్రాకి, బీదజనులందఱును, దరిద్రనారాయణానుగ్రహపాత్రులగు వణిజులను చూడనరుదెంచి వారిననుగమించిరి. ఈమహాజనమంతయును బ్రాహ్మణపురమునకు వెళ్ళి, అచ్చటి బీదజన సమూహముతో కలసి, కడలిదరి జేరిరి. అనేక చోట్ల సహాయముతో దరివైపునగల సముద్రప్రాంతమంతయు గాలించి వెతకి, కడకు సముద్రములోని యొకదిప్పకడ ఒరిగిపడి యున్న ఓడను గాంచగల్గిరి. వణిజులును తమయోడ చెక్కుచెదరక సురక్షితముగ నున్నందులకు సంతసించిరి వేలకొలది గామూగియున్న జనులప్రయత్నముచే, ఓడ చక్కగా లేవనెత్తబడి ప్రయాణమునకు సిద్ధపఱచబడెను.

వణిజులును మహానంద కందళితాంతరంగులై, తమకు సహాయపడిన బీదజనులందఱికిని, యథోచితముగ వస్త్రవస్తు బహుమతులొసంగి, సంతుష్టుల జేసి, జయజయధ్వానముల మధ్య కదలిచనిరి. ఓడ కళింగపట్టణపు రేవు చేరగానే, ధర్మభాగ్యునియొక్క బంధుమిత్ర భృత్యాదులు పురజనులతో సహా యెదురుగావచ్చి, తోడ్కొనిపోయి, మహావైభవముతో గృహప్రవేశము జేయించిరి. చోరగ్రస్తమగు వీరి ఆస్తియంతయు, ఆవోకిమీద తెప్పించబడి, అధికార్ల స్వాధీనమునందుండుటచే ధర్మభాగ్యుడు గుర్తింపుజేసిన మీదట, యతనికి కైవసమొనర్చబడెను.

పిదప ధర్మభాగ్యమును, వెనుకటివలెగాక, బీదజనుల యెడల కనికరము, సర్వమానవ సమత్వ సోదరత్వ భావములు గలిగినవాడై, దరిద్రనారాయణ వ్రతమొనరించి, సకలభూత సంతృప్తికరముగ అన్నదాన మొనరించి సకల సంపదలతో తులదూగుచు, పలుకుబడి, ప్రజామోదముగలిగి ధర్మ, అర్థ, కామ, మోక్షములను చతుర్విధ ఫలపురుషార్థములను పొందినవాడాయెను,

అనిసూతుండు శౌనకాదిమహామునుల కెరిగింపవారును సంతుష్ట హృదయులరై, బీదజనుల సేవయొక్క ప్రాముఖ్యమునుగణుతించిరి.

పంచమాశ్వాసము సంపూర్ణం

సమాప్తి.



